శ్రీరామజయం.

# మదరాసు గవర్నెంటు యొక్క ప్రధాన మంత్రిగా యుండిన శ్రీయుత గౌరవ దివాన్ బహదూర్ బొల్లిని మునుస్వామి నాయుడు గారియొక్క జీవిత చరిత్రము.

---

విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాల,

చిత్తూరు.

---

 1935 వె: 0–1–0



# శ్రీయుత దివాన్ బహదూర్ మునుస్వామినాయుడుగారి యొక్క జీవిత చరిత్రము.

---

ఈ పుస్తకము కావలసినవారు క్రింద వివరించియుండు అడ్రసుకు వ్రాసి తెప్పించుకోవచ్చును.

ప్రతివెల 0—1—0.

టి. యన్. ఉమాపతి అయ్యర్,
చిత్తూరు.

---

T. N. UMAPATHI AIYAH,
*Journalist, Social worker.*

*and Personal clerk to the late Dewan Bahadur*
B. MUNISWAMI NAIDU,
*CHITTOOR.*



శ్రీరామజయం.

1. ప్రపంచములోనుండు వృత్తులన్నిటి పైకి రైతు వృత్తి చాల శ్రేష్ఠమైనది. పుణ్యమైనది. పాపములేనిది. ఇహలోకములో కీర్తియు, పరలోకములో మోక్షము నిచ్చునది. శానిపత్యమును పోగొట్టునది. స్వతంత్రము నిచ్చునది. క్షుద్బాధను తీర్చునది. దరిద్రమును పోగొట్టునది ఎల్లప్పుడు సంతోషము కలుగచేయునది.

2. రైతు కులములో పుట్టినటువంటిన్ని మదరాసు గవర్నమెంటులో ప్రధానమంత్రిగా యుండినటువంటిన్ని శ్రీయుత గౌరవ దివాన్ బహదూరు బొల్లిని మునుస్వామినాయుడుగారి యొక్క చరిత్రమును నాకు తెలిసినంతమట్టుకు వ్రాయుచున్నాను. భాషయందుగాని యితర నేవిధములందుగాని తప్పులేదైనా యుండిన క్షమించవలయునని ప్రార్థిస్తున్నాను.

3. ఈయన కమ్మవారు కులమునకు చేరినవారు. తిరుత్తణి తాలూకా వేలంజేరి గ్రామములో మ-రా-రా-శ్రీ, బొల్లిని బొజ్జినాయుడుగారియొక్క ద్వితీయపుత్రుడు. తారణ సంవత్సరమున జన్మించిరి. బాల్యమందు వేలంజేరి గ్రామంలో వీధిబడిలో ప్రారంభవిద్య నేర్చుకొనిరి. వెనుక తిరుత్తణి గ్రామములో ఇంగ్లీషుభాషను 3-వ ఫారము వఱకు చదివిరి. హైస్కూలులో చదువుటకుగాను వీరి తండ్రిగారు మదరాసులో ఒక సంసారముపెట్టి వీరినిన్ని యితర పిల్లకాయలను చది

వించిరి. చిన్నప్పటినుండియు విద్యను నేర్చుకొను విషయము లో చాలా అక్కర గలవారు. వృధా కాలక్షేపము చేయరు. దుడ్డు వృధాగా ఖర్చుపెట్టరు. దేహారోగ్యమునకు భంగము కలుగజేయునటువంటి సిగరెట్టు బీడీ మొదలగు దురభ్యాస ములగు అలవాటులులేవు. మెట్రిక్యులేషన్ పరీక్ష తేరి క్రిస్టి యన్ కాలేజిలో బి. ఏ. పరీక్ష ప్యాసుచేసిరి. బి. యల్. పట్టమొందిరి. వెనుక మదరాసులో హైకోర్టు వక్కీలు పిదప హైకోర్టు జడ్జిగాయుండిన మ-రా-రా-శ్రీ, P. R. సుందరయ్యరు వారి ఆఫీసులో అప్రెంటిస్‌గాచేరి న్యాయవాది వృత్తిలో ప్రవేశించిరి. పిదప తమ స్వంత జిల్లాయగు చిత్తూరు జిల్లాలో 1909 సంవత్సరమున ప్రాక్టీసుచేయ నారంభించిరి. న్యాయ వాది వృత్తిలో దినక్రమేణ అభివృద్ధికి వచ్చిరి. రైతులకుండు అన్నివిధ కష్టముల తెలుసుకొనిరి.

4. ఉభయ వాదులకుగల వివాదాంశములను చక్క గా తెలుసుకొని యుభయ పార్టీలకు నొప్పజెప్పి రాజీపఱచు వారు. స్వప్రయోజనము కొఱకు వ్యాజ్యములను పెంచరు. అందువల్ల యెదురు పార్టివారికి కూడ యితనియందు నమ్మక ము గలిగెను. కేసులను రాజీచేసి రాజీనామా వ్రాసినపుడు ఎదురుపార్టీవారు నిస్సందేహముగా రాజీనామాలో ముందు వ్రాలు చేయుదురు. న్యాయవాది వృత్తిలో మాత్రముంటే రైతుల కష్టములు అన్నిటిని నివర్తించుటకు సాధ్యము లేదని యోచించుచుండిరి. అప్పటిలో జిల్లాబోర్డు ప్రెసిడెంటుగాయుం డిన మ-రా-రా-శ్రీ, రావుబహదూరు టి. వి. రంగాచార్యులు వారు మ-రా-రా-(శ్రీ), నాయుడుగారిని డిస్ట్రిక్టుబోర్డు మెంబ

రుగా నామినేటుచేసి వైస్ప్రెసిడెంటుగాచేసిరి. నాయుడుగారు యేపనిలో ప్రూనినప్పటికిన్ని శ్రద్ధగా పనిచేయు వారుగా యుండుటవల్ల లోకల్ బోర్డు చట్టమును (Local Board's Act.) బాగుగా చదివిరి. 1920 సంవత్సరమున మదరాసు శాసనసభకు ప్రతినిధిగా నెన్నుకోబడిరి. పిదప డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు పదవికి వచ్చిరి. తనకుస్వతంత్ర అధికారమువచ్చిన తరువాత స్వలాభము నెదురుచూడక రైతుల కష్టములను నివర్తించుటకు ప్రారంభించిరి.

5. రైతులు గ్రామములనుంచి యితర యూర్లకు పోవు టకున్ను తమ ధాన్యమును బండ్లమీాద తీసుకొనిపోయి బయటి యూర్లలో సరియైనధరలకు అమ్ముటకున్ను వీలులేక చాలా కష్టపడుచుండిరి. తమ పిల్లకాయలను చదువుకొనుటకు పాఠశాలలుండు ప్రక్క గ్రామమునకు పంపుటకు సాధ్యములేక కష్టపడుతూయుండిరి. ఎట్టి యభివృద్ధికిన్ని రాకపోకలకున్ను అవశ్యమైనది రోడ్లుఅని తీర్మానించి రోడ్లులేని గ్రామములకు రోడ్లువేయను ప్రారంభించిరి. విలేజి రోడ్లు వేసినపిదప రాక పోకలకు సులభమాయెను. రైతులకేకాక సమస్తజనులకు న్ను సౌకర్యము కలిగెను. రైతుల కష్టములను తొలగించు టకు కంకణ బద్ధుడై యుండిరి.

6. గవర్నమెంటువారివల్ల నేమింపబడిన (Agricultural Commission) అగ్రికల్చరల్ కమిషన్ (వ్యవసాయ కమిషన్) Banking Enquiry Committee బ్యాంకింగు ఎన్‌కొయరి కమిటీలో మెంబరుగా పనిచేసిరి.

7. అందరిని సమానభావముతో చూచువారు. మహరాజు, బీదవాడు, పెద్దవారు, చిన్నవారు, గొప్పజాతివారు, తక్కువజాతివారు, గొప్పఉద్యోగస్థుడు, చిన్న ఉద్యోగస్థుడు, జవాను అని భేదమెంచువారుకారు. కోపమేలేదు. శాంతమూర్తి. సాధ్యమైనంతవరకు యితరులకు ఉపకారము చేయును. అపకారముచేయడు. ఇందుకు నిదర్శనము ఆయనయొక్క ముఖారవిందమే.

8. 1930 సం॥రములో జస్టిసు కక్షిలో నాయకత్వము వహించిరి. అప్పటిలో ఆ కక్షివారికి బ్రాహ్మణులపై ద్వేషమెక్కువగా నుండెను. ద్వేషము చేతనే పనిని కాదనిజెప్పి శాంతముతోను ప్రేమతోను అన్నిపనులు సాధించవచ్చునని జస్టిసుకక్షిలో బ్రాహ్మణలనుకూడ చేర్చుకోవచ్చునని తీర్మానమును ప్యాసుచేయుటకు నెల్లూరులో జరిగిన బ్రాహ్మణేతర మహాసభలో చాలాపోరాడిరి. అప్పటిలో అరవదేశములో నుంచివచ్చిన ప్రముఖులలో కొందరు ఆక్షేపించిరి. పిదప పిర్లే మ-రా-రా-శ్రీ నాయుడుగారు చెప్పిన మేరకు బ్రాహ్మణులనుకూడా చేర్చుకోవలయుననే తీర్మానమును ప్యాసుచేసిరి. అన్నిజాతులవారికిన్ని నాయుడుగారియందు నమ్మకము విశ్వాసముగలదు. మహాత్మా గాంధిగారియొక్క వుత్తరవులను తనవల్ల సాధ్యమైనంతవరకు నిశ్చయముగా ధృడచిత్తముతో నవలంబించువారు.

9. 27_10_1930 మదరాసు గవర్నమెంటుకు ప్రధానమంత్రిగా నేమింపబడిరి. మంత్రి పదవికివచ్చిన తరువాత

రైతులు డిస్ట్రిక్టు బోర్డు టోలుగేట్లకు బండ్లకు చెల్లించుచుతూ యుండిన పన్నును తీసివేయుటకు చట్టమును ప్యాసుచేయించిరి

9. ఇదివరకు గవర్నమెంటులో (Electric Corporation) వగైరా వుద్యమములను పనిచేయుట యూరోపియను కంపెనీలకే నిచ్చుచుండిన స్వతంత్రమును మనదేశస్తులున్నూ వారితోపాటి యిటువంటిపనులు చేయుటకు శక్తిసామర్థ్యములో ఎంతమాత్రమున్ను తక్కువ అయినవారుకారు అని నిరూపించుటకు మన రాజధానిలో కోయముత్తూరు, నీలగిరి, చిత్తూరు మొదలగు యూర్లలో, (Electric Corporation) లను స్థాపించుటకు సహాయము చేసిరి. ఈయన యింత గొప్పపదవికి రావడం చిత్తూరు జిల్లాకు గొప్పగౌరవమేగాక మఱియు మదరాసు రాజధానిలో యుండు కమ్మవారు కులమునకే యొక కిరీటమువలె వెలుగుచుండిరి. ఈయన ప్రధానమంత్రిగా యుండినకాలములో జస్టిసుకక్షిలో భిన్నాభిప్రాయములు కలిగినందున తన మనస్సాక్ష్యమునకు విరుద్ధముగా ప్రవర్తించుట కిష్టములేదని తెలుపుచు మంత్రిపదవికి రాజీనామానిచ్చి జస్టిసు డెమక్రెటిక్ పార్టీనిస్థాపించి దానికి నాయకత్వము వహించిరి. ఈయన జస్టిసు పార్టీనుంచి తొలగినదిమొదలు పార్టీకి దినక్రమేణ బలముతగ్గినది. అందుపై జస్టిసు పక్షమువారు యీయనను మరల నాయకత్వమును వహించి పార్టీని బలపరచవలయునని అడుగుకొన్నందుపై అందుకు కొన్ని కండిషనులను తెలియచేసిరి. పార్టీ ఏకమవుటకు ప్రయత్నము పూర్తియగు సమయములో 8–1–35 తేదిన దేహామునకు జబ్బుచేసి 6 రోజులు

ఖాయలాగాయుండి 13_1_35 రాత్రి రామస్మరణ చేయుచు వుత్తరాయణ పుణ్యకాలము పుట్టినవెంటనే వైకుంఠప్రాప్తి జెందిరి. ఈయన జీవితమువల్ల రెండుఅంశములు స్థిరముగా దృశ్యమగుచున్నది.

1. బుద్ధి యనునది మానవకోటికి భగవంతునివల్ల యివ్వ బడిన ఒకశక్తి. బాల్యదారభ్య వృద్ధిపరచి సన్మార్గములో ప్రవర్తింపచేసినయెడల అందరున్ను వృద్ధికివచ్చి వున్నతపదవికి వచ్చుచున్నారని చెప్పుటకు సంశయము లేదు.

2. జనులయందు ఐక్యమత్యము వృద్ధిపరచుటకు సర్వ జనులయందు ప్రేమ అను దానిని వ్యాపింపచేయుటతప్ప పంక్తి భోజనమున్ను, ఒక తెగలోనుంచి మఱియొక తెగవారు వివాహము చేసుకోవడమున్ను, కులభేదములను వృద్ధిపరచడ ముకాదని స్పష్టముగా తెలియచేయుచున్నది.

ఈయన వయస్సు సుమారు 51. ఈయనయొక్క అకాలమరణము యీయన కుటుంబమునకు బంధువులకు మిత్రులకున్ను, చిత్తూరు జిల్లాలో యుండు కక్షిదార్లకున్ను దేశమునకేగాక ప్రభుత్వమువారికికూడా గొప్పవ్యసనమును కలుగచేసినది.

శ్రీయుత దివాన్ బహదూరు మునుస్వామినాయుడు గారు శాసనసభ ప్రవేశించినది మొదలు యిదివరకు చేసిన పను లను సంక్షేపముగా క్రింద వివరించియున్నాను.

1. అడవుల విషయములో పోరాడి పట్టా భూమికి ఒక మైలు దూరము వరకు రిజర్వు ఫారస్టు యుండగూడదని తీర్మానము ప్యాసు చేయించిరి.

2. అడవి పంచాయతుల నేర్పాటు చేయించి పశువులు మొదలగు వాటిని మేపుకొనుటకు అడవులను పంచాయతీ దార్ల స్వాధీనము చేయించిరి.

3. పశువుల చికిత్సలకుగాను యొకఆస్పత్రి చిత్తూరు జిల్లాలో పెట్టించిరి.

4. డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటుగాయుండిన కాలములో అనాదరణ చేయబడినటువంటి గ్రామములకు రోడ్లు వేయించిరి.

5. చంద్రగిరి రెంటు కోర్టుక్యాంపుపోతూ యుండినందు వల్ల జమీందారీ యిలాఖా రైతులకు కోర్టుకు పోవుటకు గాను శెలవులు యెక్కువ అగుతూ యుండినది. దానిని తగ్గించుటకు స॥ కోర్టు చంద్రగిరిలోనే ఖాయముగా యుండవ లయునని యేర్పాటుచేయించిరి.

6. మంత్రి పదవి వచ్చినతర్వాత బండ్లకు డిస్ట్రిక్టుబోర్డు టోలు గేట్లకు రైతులు చెల్లించుతూ యుండిన టోలుగేటు పన్నును తోసివేయవలయునని చట్టము ప్యాసుచేయించిరి.

7. Electric Corporation వగైరా వుద్యమముల లో పనిచేయుటకు మనదేశస్థులకు సహాయము చేసిరి.

8. భగవంతుడు తెలివి మానవకోటి కందరికిని యిచ్చియున్నాడు. దానిని వృద్ధిపరచినయెడల అందరున్ను ఉన్నత పదవికి రావచ్చును అనే తత్వమును దృష్టాంతముగా చూపిరి.

9. ప్రేమనే భగవంతుడు ప్రేమవల్లనే ప్రపంచములో సమస్తమును జయించవచ్చును అని మహాత్మా గాంధిగారి తత్వమునున్ను మ-రా-రా-శ్రీ, నాయుడుగారికి ఆప్తస్నేహితులలో యొకరైన మ-రా-రా-శ్రీ, చిత్తూరులో నివసించు వక్కీలు జే. క్రిష్ణరావుగారు రచియించిన క్రిందవ్రాసియుండు పద్యములో కనియుండు అంశములను అనుష్ఠానమునకు తెచ్చుచుండిరి.

శ్రీయుత దివాన్ బహదూరు B. మునుస్వామినాయుడుగారి యొక్క గుణములలో కొన్నిటినిమాత్రము క్రిందవ్రాసియున్నది.

1. శాంతస్వభావులు, కోపమేలేనివారు, దుర్భాషణము లెఱుగరు.

2. ఎవరికిని ఎన్నడును కీడుచేసి ఎఱుగరు. శక్తివంచన లేక ఎల్లఱకును సాయముచేసినవారు.

3. రాజకీయాది ప్రజావిషయక కార్యములందు తన యాజ్ఞలో యుండువారు వెలిబుచ్చు స్వతంత్రాభిప్రాయముల జోక్యము గలిగించుకొనువారుగారు.

4. జాతి, మత, కుల, వర్ణభేదము పాటింపక సర్వులను సమానదృష్టితో ప్రేమించువారు.

5. అపకారము చేసినవారికికూడ నుపకారముచేయువారు.

6. ధనముకొఱకు అనవసరముగా వ్యవహారములను పెంచక వీలైనంతవఱకు రాజీచేసి ఇరుకక్షుల వైషమ్యముల చల్లబఱచువారు.

7. సర్వులతోడను సమముగా మెలగువారు, ఆకారణముననే జిల్లాబోర్డు అధ్యక్షులుగా నుండినపుడు (Land acquisition,) ల్యాండు అక్విజిషన్ ప్రొసీడింగ్సు లేకనే పెక్కురోడ్లను వేయించగల్గిరి.

8. న్యాయవాదివృత్తియందు న్యాయాధిపతిని చక్కగ గుర్తెరిగి తగురీతి కేసు నాతడు గ్రహించునట్లు వాదించువారు. కావుననే తనవృత్తియందు ఉన్నతపదవి వహించిరి.

9. సుగుణసంపన్నులు, నీతిపరులు, కావుననే ప్రతికక్షులకుగూడ వారియందు నమ్మకముండెను.

10. ప్రజలయందు ఏకీభావము ప్రబలుట ప్రేమచేతనేగాని అంతర్జాతీయ వివాహ భోజనాదికృత్యముల చేతగాని మతమును మార్చుటచేతగాని కాదని నిరూపించిరి.

సీ॥ నిఖిలజీవులయెడ నిండారుప్రేమంబు
వీచులనభిషేక మాచరించి,
సత్యధర్మాచార శమదమాదికనవప్రసవ
రాజములనర్చన మొనర్చి,
కామలోభక్రోధ గర్వాదులనుజ్ఞాన
వహ్నిదహించి నివాళిసేసి,
లోకకల్యాణంబు సేకూర్చుపుణ్యకర్మ
ఫలముల నుపహారంబొసంగి
తే-గీ. సల్పుపూజయె యుత్తమ స్తవ్యపూజ
నంబనాసక్తయోగ సారంబుమోక్ష
సాధనంబునీకుఁ బరమసమ్మతంబు
విశ్వకారణ కారుణ్య వృష్టిపూర॥
ఆ॥ శాంతమానసమున జల్లనైశీతల
భాతినున్నవాడు పరమయోగి
అట్టివాడుముక్తి నతివేగగైకొను
విశ్వదాభిరామ వినురవేమ.
ఆ॥ శాంతమేజనులను జయమునొందించును
శాంతమునసెగురుని జూడదెలియు
శాంతభావమహిమ జర్చింపలేమయా
విశ్వదాభిరామ వినురవేమ.

ఇట్లు,

20 1936. టి. యస్. ఉమాపతిఅయ్యర్.

N. B. శ్రీయుత మునుస్వామినాయుడుగారి యొక్క చరిత్రమును, బాలురందరున్ను చదివి ఆయనవలె దేశమునకు కీర్తి తేవలయునని కోరుచున్నాను.

